ఇన్ని చెప్పినా, తన విశ్వరూపాన్ని చూపినా అర్జునుడు ఒకవేళ వెనుకడుగు వేస్తాడేమోనన్న తలంపుతో శ్రీకృష్ణభగవానుడు ఈవాడిబాణాన్ని అర్జునునిపై ప్రయోగించాడు.

స్వభావజేన కౌంతేయ!
నిబద్ధః స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్
కరిష్యస్యవశోపి తత్ శ్లో - 60

అర్జునా!
అవివేకము వలన నీవు
నీకర్మను ఆచరించుటకు
ఇచ్ఛగించకపోయినను
స్వభావసిద్ధమైన నీ గుణము
వలన నీలో ఏర్పడిన కర్మయే
నిన్ను బంధించి ముందుకు తోయును
అపుడు నీవు పరవశుడవై యుద్ధము
చేయుటకై ఉపక్రమించెదవు

ఈశ్వరస్సర్వభూతానాం
హృద్దేశేర్జున!తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని
యంత్రారూఢాని మాయయా శ్లో- 61

అర్జునా!
యంత్రమును అధిరోహించిన
వారివలె వున్న సకల విధములైన
ప్రాణులను ఈశ్వరుడు తన మాయ
చేత త్రిప్పుచూ సమస్త జీవుల
హృదయములయందు వెలుగొందుచున్నాడు

తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్పరాం శాంతిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ శ్లో - 62

అర్జునా!
సమస్త భావముల చేత ఆ పరమేశ్వరుని
శరణు పొందుము, ఆయన అనుగ్రహము
వలన ఉత్తమమైన శాంతిని, శాశ్వతమైన
మోక్షమును పొందగలవు

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం
గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ
యథేచ్ఛసి తథా కురు శ్లో - 63

ఈ విధముగ రహస్యములన్నింటి
కంటెను అతి రహస్యమైన
జ్ఞానమును నీకు బోధించితిని
దానిని బాగుగా విచారించి, ఆ
పిదప నీకుతోచినటులజేయుము

సర్వగుహ్యతమం భూయః
శృణు మే పరమం వచః
ఇష్టోసి మే దృఢమితి
తతో వక్ష్యామి తే హితమ్ శ్లో - 64

రహస్యములన్నింటికంటెను
పరమరహస్యమైనదియును
ఉత్తమమైనదియునగు
నావచనములను మరల
వినుము, నీవునాకు మిగుల
ఇష్టుడవు గనుక నీ మేలు
గోరి చెబుతున్నాను

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీమాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే
ప్రతిజానే ప్రియోసి మే శ్లో - 65

నాయందు మనస్సు నుంచుము
నా భక్తుడవు కమ్ము, నన్ను
అర్చించుము, నాకు నమస్కరింపుము
అటుల కావించెదవేని నీవు
నన్నే పొందగలవు, నీవు
నాకు ఇష్టుడవు, ఈ సత్యమును
అందువలన ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః శ్లో - 66

అన్ని ధర్మములను విడిచిపెట్టి
నన్నొక్కనినే శరణు పొందుము
నేను నిన్ను సకల పాపముల నుండి
విడిపించెదను, శోకించవద్దు

ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం
న చ మాం యోభ్యసూయతి శ్లో-67

నేను నీకు బోధించిన ఈ గీతాజ్ఞానమును
తపస్వికాని వానికి, భక్తుడు కాని వానికి
శుశ్రూష చేయనివానికి, నన్ను
ద్వేషించువానికి చెప్పకూడదు

య ఇదం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా
మామేవైష్యత్యసంశయః శ్లో - 68

పరమ రహస్యమైన ఈ గీతా
జ్ఞానమును నా భక్తులకు
ఎవ్వరు చెప్పుదురోవారు
నాయందు ఉత్తమమైన
భక్తిని కలిగి సంశయరహితులై
నన్నే పొందెదరు

న చ తస్మాన్మనుష్యేషు
కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మాత్
అన్యః ప్రియతరో భువి శ్లో - 69

మనుష్యులలో అట్టివారికంటే
ప్రియమైన వారు నాకు మరొకరు
లేరు, వారికంటే నాకు మిక్కిలి
ప్రియమైన వారు వేరే వుండబోరు

అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహం
ఇష్టస్స్యామితి మే మతిః శ్లో - 70

ధర్మప్రయోజనమైన మనయొక్క
ఈ సంవాదమును ఎవడు చదువ
నున్నాడో వానిచే చేయబడు జ్ఞానయజ్ఞము
చే నేను ఆరాధించబడుచున్నాను

శ్రద్ధావాననసూయశ్చ
శృణుయాదపి యో నరః
సోపి ముక్తశ్శుభాన్లోకాన్
ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ శ్లో-71

ఈ గీతాజ్ఞానమును
శ్రద్ధావంతుడై, అసూయారహితుడై
ఆలకించెడి మనుజుడు పాపరహితుడై
పుణ్యాత్ములు పొందెడి లోకములను
పొందుచున్నాడు

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ!
త్వయైకాగ్రేణ చేతసా
కచ్చిదజ్ఞానసంమోహః
ప్రనష్టస్తే ధనంజయ! శ్లో - 72

*అర్జునా!*
*నీవు నిశ్చల చిత్తముతో*
*ఈ గీతాశాస్త్రమును ఆలకించితివా?*
*అజ్ఞానమువలన కలిగిన నీ మోహము*
*నశించినదా?*

ఈ విధంగా శ్రీకృష్ణభగవానుడు తాను చెప్పవలసినదంతా చెప్పి చివరకు అర్జునుని పైవిధముగా ప్రశ్నించెను. పై వాక్యము చేత గీతాచార్యుని (భగవానుని) బోధ అంతయు పరిసమాప్తి అయింది.

భగవానుని ఈ ప్రశ్నకు అర్జునుడు సమాధాన మొసంగుచున్నాడు.

నష్టో మోహః స్మృతిర్లబ్ధా
త్వత్ప్రసాదాన్మయాచ్యుతః
స్థితోస్మి గతసందేహః
కరిష్యే వచనం తవ శ్లో - 73

*కృష్ణా! ప్రభూ!*
*నీ అనుగ్రహమువలన*
*నా అజ్ఞానమునశించినది*
*ఇపుడు సంశయ రహితుడనై*
*నీయాజ్ఞను శిరసావహించెదను*

అని కురుక్షేత్ర రణరంగాన అర్జునుడు యుద్ధమునకు ఉపక్రమించెను. ఈ విధంగా సంజయుడు తాను తెలుసుకున్న గీతాబోధనంతటిని ధృతరాష్ట్రునకు ఎరిగించి ఆనందపరవశుడై తన ఆనందమునుత ఈ విధంగా వ్యక్తము చేసెను.

ఇత్యహం వాసుదేవస్య
పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌషం
అద్భుతం రోమహర్షణమ్ శ్లో - 74

*ఈ విధంగా*
*ఆశ్చర్యకరమైనదియు*
*గగుర్పాటును కలిగించునదియును*
*మహనీయుడైన అర్జుననకు, భగవానుడైన*
*శ్రీకృష్ణునకు జరిగిన సంవాదమును*
*నేను వింటిని*

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్
ఏతద్గుహ్యతమం పరం
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్
సాక్షాత్కథయతస్స్వయమ్ శ్లో - 75

*వ్యాసభగవానుని అనుగ్రహము*
*వలన గుహ్యమైనట్టిదియును*
*ఉత్తమమైనట్టిదియును*
*అగు ఈ యోగశాస్త్రమును*
*యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు*
*చెప్పుచుండగా ప్రత్యక్షముగా*
*నేను వింటిని, దానినే ఇపుడు*
*నీకు నేను తెలియజేశాను.*

రాజన్! సంస్మృత్య సంస్మృత్య
సంవాద మిమ మద్భుతం
కేశవార్జునయోః పుణ్యం
హృష్యామి చ ముహుర్ముహుః శ్లో-76

*ఓ ధృతరాష్ట్రమహారాజా!*
*శ్రీకృష్ణార్జునుల మధ్య జరిగిన*
*కళ్యాణకరమగు అద్భుతమైన*
*ఈ సంవాదమును తలచుకొనిన*
*కొలదియును నేను పరవశించిపోతున్నాను*

తచ్చ సంస్మృత్య సంస్మృత్య
రూపమత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్!
హృష్యామి చ పునః పునః శ్లో - 77

*రాజా!*
*ఆ శ్రీహరి యొక్క అత్యంత*
*ఆశ్చర్యకరమైన విశ్వరూపమును*
*తలంచుకొన్న కొద్దీ నాకు*
*గొప్ప ఆశ్చర్యమునూ, సంతసము*
*నూ కలగుచున్నవి*

యత్ర యోగేశ్వరః కృష్ణో
యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతిః
ధ్రువానీతిర్మతిర్మమ శ్లో - 78



యోగేశ్వరుడు అగు
శ్రీకృష్ణభగవానుడు
ధనుర్ధరుడైన అర్జునుడు
ఎచట వుందురో అచట
సంపద, విజయము,ఐశ్వర్యము
సుస్థిరమగు నీతియుండును.

"ఈశ్వర ప్రసాదరూపంగా సింహావలోకనము పేరిట అంటే ఉపసంహారం పేరిట మనకు లభించిన ఈ అధ్యాయాన్ని సమాప్తం చేయబోయె ముందు 19-6-1932న ధూళియా జైలులో తన తోటి రాజకీయ ఖైదీలనుద్దేశించి మహర్షి వినోబా చేసిన గీతా ప్రవచనంలో "దాదుకవి" మేకను గురించి తెలిపిన విషయాన్ని తెలిపి అధ్యాయం సమాప్తం చేయుట మంచిదన్న అభిప్రాయంతో ఆ విషయమును ఇక్కడ పొందుపరుస్తున్నాను.

"మేక బ్రతికియుండుగా మే-మే- మే
అనును, అనగా నేను- నేను-నేను
అనును, అయితే అది చనిపోయిన
పిమ్మట దాని వెన్నెముకనుండి తీసిన
నరమును దూదినేకు కమానుకు కట్టి
దూదినేకు చున్నపుడు అది "తుహి-తుహి-
తుహి" అని పలుకును, అంటే "నీవె-నీవె-నీవే"
నన్నది దానర్థము.

కనుక చనిపోయిన మేక నరం యొక్క సందేశాన్ని మనం ఈ విధంగా భగవానుని స్మరించుకుంటూ ఈమోక్షసన్న్యాసయోగమును ముగిద్దాం.

అంతా నీదయరా అఖిలోద్ధారా! అంతా నీదయరా!
చింతలు నీ దయ చిత్తమునీ దయ
వింతలు నీ దయ, విత్తము నీదయ ॥అంతా॥

జనకుడు నీ దయ, జననియు నీదయ
జనన మరణ సంసారము నీ దయ
శత్రువునీదయ, మిత్రుడు నీ దయ
పుత్రుడు నీదయ పుత్రి, కళత్రము నీదయ ॥అంతా॥
గాలియు, నేలయు, గగన జలాగ్నులు
కాలము, దేశము, కష్టనష్టములు
భావము నీదయ, భాషయు నీదయ
పావన కరమగు ప్రాణము నీదయ
అంతా నీదయరా అఖిలోద్ధారా! అంతా నీ దయరా!

ఈ విధంగా మనం భగవానునికి శరణాగతులమైనప్పుడు ఆయన మనలను సర్వకాల సర్వావస్థలయందు కనిపెట్టియుండి మన యోగక్షేమాలను చూస్తుండును.

'ఓం తత్సత్'

ఈ విధంగా ఉపనిషత్తును బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన
శ్రీ మద్భగవద్గీతయందలి మోక్షసన్న్యాసయోగమను పేరుగల
పదునెనిమిదవ అధ్యాయం సమాప్తముగావించబడింది

## ఈ గ్రంథ రచనలో తోడ్పడిన గ్రంథాలు

| క్రమ సంఖ్య | గ్రంథం | వ్యాఖ్యాత లేక రచయిత |
|---|---|---|
| 1. | మహాభారతము | ఆంధ్రాను వాదము కవిత్రయము నన్నయ - తిక్కన - ఎర్రాప్రెగడ. |
| 2. | శ్రీ మద్భగవద్గీత | మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి వారు |
| 3. | గీతామకరందం | శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు |
| 4. | The Gospel of Selfless Action (అనాసక్తాయోగము) | మహాత్మా గాంధీ |
| 5. | గీతా ప్రవచనములు | ఆచార్య వినోబాభావే |
| 6. | శ్రీ అరవింద గీతా దర్శనము | శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు గారు |
| 7. | భగవద్గీత | పూజ్యశ్రీ భక్తి వేదాంత స్వామి ప్రభుపాదులవారు |
| 8. | శ్రీమద్భగవద్గీత | శ్రీ శిష్ట్లా సుబ్బారావుగారు |
| 9. | The Bhagavadgita | Swamy Chidbhavanda |
| 10. | Sri Madbhagavdgita Tatwa Vivekini | Sri Jayadayal Goyandka |
| 11. | శ్రీమద్భాగవతం | శ్రీ బమ్మెర పోతనామాత్యులు |
| 12. | సత్యార్థ ప్రకాశిక | స్వామి దయానంద సరస్వతి |
| 13. | శ్రీ వేద తత్వ ప్రకాశిక | స్వామి దయానంద సరస్వతి |
| 14. | శ్రీ మద్భగవద్గీత | తెలుగు అనువాదము పండిత గోపదేవ శాస్త్రి |
| 15. | గీతా దర్శనము | శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు |
| 16. | గీతావాహిని | శ్రీ సత్యసాయిబాబా |
| 17. | శ్రీమద్భగవద్గీత | శ్రీ సుందర చైతన్యానంద స్వామి |
| 18. | గీతా సాంఖ్యం | శ్రీ శార్వరి |
| 19. | మహాభారత చరిత్ర | శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి |
| 20. | ప్రాచీన యుగము | శ్రీ కె. కృష్ణారెడ్డి |
| 21. | ఋగ్వేదార్యులు | రాహుల్ సాంకృత్యాయన్ |
| 22. | పురాణనామకోశము | బూధరాజు రాధాకృష్ణ |

*గ్రంథ కర్తలకు నా కృతజ్ఞతలు*
*– రచయిత*

